శుద్ధపంచాక్షరీసిద్ధి యుతుఁడ, సకలలక్షణలక్ష్య సాహితీని
పుణుఁడ శైవవైష్ణవసదాచార రతుఁడ
వేంకటాఖ్యుఁడ నే జగద్విదితముగను
శతకమొనగూర్తు త్వత్సమర్పితముగాఁగ ॥భూ॥

సీ. దండంబువోద్గండ మండితకోదండ దండంబు భూరిపరాక్ర
మచండ, దండంబుపాలితార్త స్తుత్యవేదండ దండంబుముని
వరదానశౌండ, దండంబుదండితాగతనిశాచరకాండ దం
డంబు వైరిరౌద్రప్రకాండ, దండంబు భక్తసంత్రాణ మ
హోద్దండ దండంబు బ్రహ్మాండధరప్రచండ
దండమోపాపతిమిగ మార్తాండనీకు
యనుచుమ్రొక్కెదనను బ్రోవుమయ్యవేగ ॥భూ॥

సీ. శరణుజగత్కర్త శరణుజగద్భర్త శరణుజగద్ధర్త శరణు
శరణు, శరణుతాండవలీల శరణుపాండవపాల శరణుపండిత
ఖేల శరణుశరణు, శరణుశంకరపక్ష శరణుకింకరరక్ష శరణు
పంకరుహాక్ష శరణుశరణు, శరణుదయాసార శరణుజయా
ధార శరణునయాగార శరణుశరణు
శరణువారణ వారణశరణుశరణు
శరణుకారణ కారణశరణుశరణు ॥భూ॥

సీ. వీరాయ గోపికాజారాయ రుక్మిణీదారాయ భవభయోత్తా
రణాయ, శూరాయ మునిజనాధారాయ కరుణాపరివా
రాయ సత్యప్రచారణాయ, ధీరాయ వార్ధిగంభీరాయసద్గు
ణవారాయ దురితనివారణాయ, స్ఫారాయ ధృతజగద్భా
రాయ ననసుకుమారాయ కృతశత్రు మారణాయ
తేనమోయంచు వినుతింతుధీరమతులు

సిద్ధసామ్రాజ్య లక్ష్మిచేఁ జెలఁగుచుండు ॥భూ.

సీ. మసిడితుప్పలకు గొప్పలుదివ్వనేటికి వట్టినూతికి యొరల్ గట్టనేల, గొడ్డుగోతుకునొజ్జ కొట్టుకాయంబేల మూనక మ్మకుపైటమాటదేల, అంధురాలికినిల్వు టద్దమేటికి నపుంసకునకొయ్యారంపుచానయేల, దొంగముండకు వ్రతోద్యోగనిష్ఠలవేల జారకాంతకు సదాచారమేల
క్షుద్రగుణునకు సజ్జనగోష్ఠియేల
మోటకొయ్యకు మృదువైనమాటలేల ॥భూ.

సీ. దురితాత్మునకు దేవ గురుపూజనంబేల కర్ణహీనులకు చౌకటులవేల, జ్వరరోగకృశునకు హరిచందనంబేల పరమలోభికిదానపటిమయేల, కర్మబాహ్యునకు గంగాస్నానమేటికి కామాంధునకు తపఃకాంక్షయేల, తిండిపోతునకు నిత్య దేవతార్చనలేల వెఱ్ఱివానికి సద్వివేకమేల
మూర్ఖజనునకు నతతప్రమోదకరణ
సాధుసజ్జనగోష్ఠి ప్రసంగమేల ॥భూ.

సీ. దుర్మతాత్మకుగంధ కుసుమాగరులవేల గూదలంజకు జక్కోకలేల, మొండికట్టెకు ధర్మములుదెల్పఁగానేల సొట్టనికి నాట్యశోభలేల, అంధురాలికినయ నాంతసౌంజ్ఞల బోసిదానికిని తాంబూలమేల, పలుగుదండకు పతిమార్గంబేల చెడుగుముండకు నీతిజెప్పనేల
మూర్ఖజనునకు బహుతరామోదకారి
సరసకవితావిచిత్ర వైఖరులవేల ॥భూ

సీ. గుడిగూల్చి యిటుకలకొట్టుగట్టిన వాఁడు విఘ్నేశ్వరుడునై, తిన్న యింటికిఘాత పన్నఁజూచ

న్యాపత్కృతికి భీతాత్ముఁడగునె, చెలులచుట్టంబుల చెఱిపిన
పాపాత్ముఁడోరుల మాపగిచింతనొందఁగలఁడె, తనవారల
కంగీడు దలఁచిననిర్దయుండె తరబాధకు సంశయించఁగలఁడె
తల్లిదండ్రులహింసించు దారుణుండు
దుఃఖపడగలఁడే గురుద్రోహమునకు ॥భూ॥

సీ. తల్లిచెవుల్ దెంచ దలఁచిన మూర్ఖుండు బినతల్లిచెవి దెంచ
భీతిపడునె, తండ్రినిపస్తుంచి తాదిన్న దుర్మతి యాఁకొన్న య
తిథుల కన్నమిడునె, తమ్ములపాలి విత్తమ్ము మ్రింగుఖలుం
డు పరధనంబుల కాసపడక యున్నె, తనయులపట్ల మాత్స
ర్యమూను దురాత్ముఁడన్య వైరముదోషమని తలఁచునె
నమ్మువారినిజెఱచు దుర్నయపరుండు
యితరులనుబాగుజేయ నూహించగలఁడె ॥భూ॥

సీ. పైతృకంబునరాత్రి భక్షించు చపలుండు యుపవాసములు
నిష్ఠనుండగలఁడె, యిలువెడలఁగ తానలయుమాలుగుఁజోతు
తీర్థయాత్రసక్తిఁ దిరుగఁగలఁడె, గ్రహణకాలమున ముగ్గని
మందుడనిశంబు వేడ్క పాత్రితస్నాన విధికిఁజనునె, బావశి
రోకనవ్వయంపాక మివ్వనిలోభి నిత్యాన్నతతిఁ బిలువఁ
తనదుపెండ్లాముసదిమి దీర్పనిదదుండు గ్రలఁడె
దివిజమరదండ్రఁ గోడండ్రఁదీర్పగల్గఁడె ॥భూ॥

కెడుబిచ్చంబు పెట్టజాలనిదాత యిష్టార్థసంసిద్ధి
చేనిగట్టేదాటలేని గుజ్జమువైరిగిరి దుర్గములకు లం
దె, యూరఁబంతిభీతి నొందిపారిన బంటు దాడి
కేటాడఁగలఁడె, కొలుచునారికిజీతములనొసం
యర్థులబిలిచి వెయ్యారులిడునె

బట్టుబాగడనినోళ్ల పూటబత్తెమిడని
యతినికృష్టుఁడుసత్కృతులంగఁగలఁడె ॥భూ॥

సీ. అప్పిచ్చియుమ్మరియడుగునాతఁడధర్మ దెగదొబ్బు నాతఁడు
తగవు పెద్ద, అడ్డుండి తప్పించు మనువాఁడుకిరినుండు తం
టాలు బెట్టునాతండుసాధు, వెరువిచ్చియడిగిన నరుఁడుదు
రాత్ముఁడు నమ్మకమిన్న వాఁడార్యవరుఁడు, దాచయిచ్చిన
సొమ్ము దలఁచువాఁడవివేకి లేదుపొమ్మనువాఁడు వేదవేత్త
యనుచుతీర్పులు చేసినయట్టిమూఢు
లంతకన్నను గుణవంతులవనిలోన ॥భూ॥

సీ. తనదునరిద్రత్వమునకు నేడ్వఁగ నేల యితరసంపద తాస
హించలేక, తనయాలు రంభబోయినఁ గృశింపఁగ నేల తా
నన్యసతి పొందుమాన లేక, తనదుశత్రులసాధ్యులని చింత
పడనేల యొరులమాపంగఁ దానుడుగలేక, తనపుత్రులవ
గుణులని మొత్తుకోనేల యొకరిబిడ్డలనీతి కోర్వలేక
యెఱుగ నేరని మూఢుల కేమిజెప్ప
దీనికిఫలంబు మీఁదనుగానవచ్చు ॥భూ॥

సీ. తనతాతనిరతాన్న దాతయంచనేలమఃసలామెయూళ్ళంత
ముష్టియెత్త, తనతండ్రిగారు సద్వ్రత నిష్ఠుఁడననేల తల్లి
బల్ జారవర్తనలు సేయ, తనదుభార్యను వరగుణవతియన
కూతుఁరుకులవంపు రీతి నడువ, తనవారలంత సద్ధర్మ
ననేల చెల్లెలుచౌర్యముల్ సేయుచున్న
తానుతీర్పరినని యభిమానమేల
కొడుకుయొకమూలఁ దెరవాట్లుగొట్ట

సీ. అప్పుబుచ్చుకొనిలేదను మొండికొయ్యకు

భాగమగునె, గురుజనద్రవ్యాపహరణశీలున కన్యధనము
హరింపసంతాపమగునె, తల్లిదండ్రులను బాధలబెట్టు క్రూర
చిత్తునకు బాంధవపీడ దోషమగునె, పాలించుప్రభువు కపా
యమెంచు దురాత్మునకుమిత్రఘాతయన్యాయమగునె
తనయుపత్నిని రమియించు దారుణునకు
పరసతీసంగమాసక్తిపాపమగునె ॥భూ.

సీ. పుత్రికకేనల్లుఁబూనఁబెట్టనిమామగారల్లునకురత్నహార
మిడునె, పెనిమిటికేకూడుఁబెట్టనియిల్లాలు శ్రీబంధులకు
విందుసేయఁగలదె, తనతల్లిపట్లనెతప్పినమూర్ఖుఁడత్తల్లి సూ
జ్ఞాప్తి మన్నఁగలఁడె, తమ్ములకే కీడు తలఁచెడి పాపాత్ముఁ
డొకరి బాగుకుచింత యుంచగలఁడె
యిట్టిదుర్మార్గవర్తుల కెవరుచెప్పఁ
గలరుయమరాజు యొకఁడుదక్కంగజగతి ॥భూ.

సీ. తల్లినివేరుంచితమ్ములవిడఁదోలి అక్కచెల్లెళ్ళ సొమ్ముపహ
రించి, బంధుప్రులనుతృణప్రాయంబుగానెంచి యొరులమా
టఁగ మదినూహఁజేసి, తనకన్నఁదెలిసిన జనుఁడెవ్వఁడనిగొప్ప
విర్ర యించుకంతయు ధర్మమొఱుఁగకుండి, లోపలబహుదు
రాలోచనంబులుజేసి పైకినీతులు పెక్కుబలుకుచుండి
బుధులకొకకీడు సేయంగఁబూనఁజూచు
నిట్టిపురుషాధముని జన్మమెందుకొఱకు భూ.

జనద్రవ్యాపహరణమ్వొకటి అన్యసతీసంగమాపి
?, పితృమాతృసద్భక్తి విముఖత్వమొకటి సూత్రి
త్యాగమొకటి, సాధుసజ్జనబంధు జనద్రోహమొ
మినిందాపర భావమొకటి, వివిధపండితవర్గ

విద్వేషమొక్కటి మిత్రఘాతృత్వ ప్రమేయమొకటి
యిన్నియునుగల్గి వర్తింపుచున్నమాట
కొయ్యలకోకళ్లు తీర్పులు చెయ్యఁగలరె ॥భూ.

సీ. తనవారుతలవంపు పనులుజేయసహించు పరులుజేసినతప్పు
పట్టఁజూచు, తనయింటిలోకాని పనికమ్ముకోఁజూచు పొరి
గింటిపని రవ్వపరుపఁదలఁచు, తనపుత్రిజారవర్తన మాటు
పడఁజేయు పరులబిడ్డలరంకు బయలఁబెట్టు, తనకుచెల్లెలి
దొంగతనములోననడంచు లాఁతివారైన హేళనమొనర్చు
యిట్టిదుర్మార్గులకు యమపట్టణమున
దీనికిఫలంబు తథ్యమైగానవచ్చు ॥భూ.

సీ. వ్యాఘ్రింబులేళ్లజంపక మల్లిపోవునె, పిల్లిమానునెకోడిపిల్లఁ
బట్ట, తోఁడేలు మేఁకలదునుమాడకుండునె, పెనుఁబాముగప్ప
లదినకయున్నె, కొంగచాపలను గళుక్కనమ్రింగకుండునె,
జేఁగగువ్వలనుపీడింపకున్నె, దుంతగుజ్జుములను దొడరికొట్ట
కయున్నె కాకిగోరలఁదన్ని కరువకున్నె
ఖలుఁడుసజ్జనులకుఁ గీడుదలఁపకున్నె
కూడదనియెందఱన్న నీక్షోణియందు ॥భూ.

సీ. బాలుడంచును పోట్లపసరంబుపసులునె గుడ్డివాఁడని కాట్ల
కుక్కజనునె, చూలింతరాలని తేలుమన్నించునె మునలిగో
వని కాకిమ్రిక్కలిడునె, ఫలవృక్షమని గదల్పకపోవునే
గాడ్పు భూసురుండని పులిప్రాజలిడునె, పలుకుచిల్కని పిల్లి
దలఁచి యూరకయున్నె యీనుచేసని మల్లియెద్దు జనునె
పరజలబాధించు దుష్టవర్తనుఁడొకండు
సుజనునకుఁగీడు సేయంగఁజూడకున్నె భూ.

సీ. కంటిలోపల పెద్దకాయ గాచినలాగు కడుపులోపలబల్లి
బాడిమినట్లు, నరములపై గొప్పకురుపు బుట్టినమాడ్కి
పెడతలనొకకంతి పెరిగినట్లు, కాలిలోపలకొఱ్ఱు గట్టిగా
దిగినట్టు పొట్టలోపలశూల బొడిచినట్లు, మూత్రరంధ్ర
ములోన ముల్లునాటినయట్లు గూబలోపలపుర్వుగొలికినట్లు
చెడుగుకొడుకొక్కరుఁడు బుట్టిచెడ్డపోని
వానితలిదండ్రులకు నేయీవసుధయందు భూ.

సీ. పరిబలశత్రువుల శప్పముదెంచఁ బోలేదు బీదలఁజంపంగ
పెద్దమొకము, మెచ్చిరించువారి నదేరాయనఁగ లేదు బుధు
లమూర్ఖున పెద్దపోట్లగిత్త, తన్నవచ్చినవారి దరిఁజేరఁ
గాలేదు సాధులపైకి విస్తారబలుఁడు, తనయిల్లుపున్నకో
దలఁచువారికి మొర్కు పరులమాపఁగ బహుసాయవేత్త
హరిహరియిట్టి పాపాత్ములవనిలోన
మన్నుచున్నారు యేమనివిన్నవింతు భూ.

సీ. వీరు పెద్దలటంచు వీరుబంధువులంచు వీరుసజ్జనులంచు వీరు
గురువు, లంచునువీరు ధరామరోత్తములంచు వీరుయోగ్య
లటంచు వీరుసుకవు, లంచునువీరులాచార్యు లంచునువీరు
విద్వాంసులంచును వీరుసద్విచారులంచు, వీరుసదమలాత్ము
లటంచు వీరుపూజార్హ పరిచారులంచు
యించుకంతయు మదిలోఁదలంచఁబోదు
దుండగంబునపలుగాకి మొండికొయ్య భూ.

సీ. పులినిజంపగ నక్కపోతుగాసినలాగు జలధియీదఁగఁగుక్క
జముగపగిది, గరుఁడుని గరువసీర్కట్టె పొంచినమాడ్కి
కొండకోరియఁగ గొత్తెమరుకీతి, దంతిలోఁబెనగంగమం

తోఁ జొరవమానికి వృషభమడ్డగఁ బిల్లి మొగిరినట్లు, కాలసర్ప
ముమిఁ గ్రింగకప్ప చూచినరీతి దీపమార్పఁగ యీఁగ దిరుగుభ్రాంతి
ధరణి నధమాధముం డొక్క నరుఁడు గ్రొవ్వి
గొప్పవారలతో మెదురొడ్డఁ దలంచు భూ.

సీ. ధర్మంబు వీసమంతయుఁ దల్పఁగా నాస్తి దానమన్న దికల లోన
నున్న, అర్థిపాలనము గవంతఁ గానఁగ వట్టి సత్యవాక్యంబు లేశం
బు లేమి కారుణ్యభావంబు గోరంత యును కల్గ దమితమానసక్తి
కొంచెము హుళక్కి, స్నానసంధ్యాద్య నుష్ఠానకర్మంబిల్లు శై
వవైష్ణవభక్తి తోత్రవ జబ్బు
యిట్టి మూఢులఁ బుట్టించినట్టి బహ్మ
ననఁగవలెగాక పిండ్రిఁ దట్టుమఁబనేమి భూ.

సీ. అన్యాయపక్కృతి వాని కాధారభూతంబు దుర్బుద్ధి వానికిఁ దోఁ
డుపీడ, దారుణత్వము వాని తల పైకిరీటంబు పరదూషణము
వాని పంట చేను, అన్యాయవృత్తిఁ గడ భ్యసించిన విద్య బం
ధువైరము వాని పట్టుకొమ్మ, పాపిష్ఠహింసా కర్మ వానినిత్య
జపంబు పాపశీలము వాని పాలిసొమ్ము
యమునిలోకులు తన్నుఁడుగ్రోను చునుండఁ
బ్రతుకు మనుజుని కన్న గార్దభము మేలు భూ.

సీ. మహిలోకోపకార ధర్మము వహించఁడుగాని యసహాయశూ
రుఁడన్యాయపక్కృతికి, సముచిత స్మృతిశాస్త్ర చర్చ సేయఁడుగా
ని పూర్వపక్షవాదములకు మొనటి చెయ్య, పుణ్యకార్యారంభ
బుద్ధిగాంచఁడుగాని పాపకర్మకు మత స్థాపకుండు, పరలోక
చింతఁ దప్పఁడుగాని పాపిష్ఠహింసా కర్మయందు నిష్ఠాగరిష్ఠుఁ
డనుచు భూజనులిట్లు దన్నుఁడు కొనఁగ

నుండుమనుజుండు జీవన్మృతుండుగాఁడె భూ.

సీ. వృథుశౌర్యమున్నఁ జూపింపఁగావలె శత్రుసేనల పైకివెంచే
యునాఁడు, దృఢవిద్యయున్న వాదింపఁగావలె మహారాజ
ధీర సభాంతరాళమునను, వరకవిత్వంబున్న బ్రకటింపవలె
ద్రోహకారి మూర్ఖులదిట్టఁగాలమందు, అమితధైర్యంబు
న్ననగుపింపవలె మహాఘనవిపద్దశ ప్రాప్తకాలమందు
నగుపరచకున్న చచ్చుపినుఁగులుగాక
వీరులోకపూజ్యులా పృథివీస్థలమున భూ.

సీ. జారుఁడై దుష్టప్రచారుఁడై పాపవిచారుఁడై బహుదురాచా
రుఁడగుచు, హీనుఁడై మూర్ఖసంతానుఁడై త్యక్తాభిమా
నుఁడై నిరతాపరిమాణుఁడగుచు, దుష్టుఁడై సజ్జనకష్టుఁడై
కోపసందష్టుఁడై నిజకులభ్రష్టుఁడగుచు, క్రోధియై బంధు
విరోధియై బహుజనబాధియై బుధమనోవ్యాధియగుచు
బరగుచున్నట్టి నిర్భాగ్యనరుఁడుతనదు
పాట్లుయిక్కడయగునె యాపయినిగాక భూ.

సీ. మేపినందలము పైకెక్కించినను క్రిందికురుకడిఫుల్లెల కు
రుకకున్నె, పిల్లిగద్దియఁబెట్టి పూజించిన నుచ్ఛిష్టభక్షణం
బునుఁగగలదె, బలుచక్కెరల యుక్కెరలఁగాకి బెంచిన
గాకుకూతలుగూయఁ గనకున్నె, దున్నపోతుకు మన్ని
వన్నెలుపద్దిన బురదగోతులలోనఁ బొరలకున్నె
నీచమనుజుని బుధులుమన్నించిపేర
గిలిచినను వాని గుణముఁజూపింపకున్నె భూ.

సీ. కఠినమాత్రమద్ధుల కోసగనివాఁడు నోరులకలిమికి దుఃఖ
ము.దువాఁడు, సంతతదుర్గుణాచారుఁడై దగువాఁడు వరు

లబాధించఁ బొల్పఁడెడువాఁడు, తమ్ములఁజెరుప యత్నము
దలంచెడువాఁడు బుధులతో వైరంబుఁ బూనువాఁడు, పదు
గురుకాదన్న పనులు జేసెటివాఁడు పరధనంబుల కాసపడెడు
సుకవిజనములతోఁ బోరఁజూచువాఁడు (వాఁడు
దుర్గతినిజెందు నిహపరదూరుఁడగుచు భూ.

సీ. పరువుపాత్రజను పౌరుషమణగారు కులము గోదావరి కూల
జరుగు, మహిమమర్యాదలు మంటలోఁగలియును చదువులు
సంధ్యలుచట్టువారు, పెద్దలుబుద్ధులు పరలోక మేగును గొ
ప్పలుకీర్తులుతుప్పలెక్కు, ధర్మమార్గమునీతి నిర్మూలమై
యుండు సకలప్రతిష్ఠ లుపసన్నగిల్లు
వంశమందునవొక పాపవర్తనుండు
బుట్టుటనుజేసిబుధులకీ భూమియందు భూ.

సీ. గడియలోపల పెక్కు కల్లలాడఁగవచ్చు నాడినమాట లేద
నఁగవచ్చు, అప్పులుయెగదొబ్బి చెప్పకొమ్మనవచ్చు చుట్ట
లచుల్కఁగాజూడవచ్చు, తనవారసకబాధలఁ బెట్టగావచ్చు
మిత్రఘాతుకవృత్తి మెలఁగవచ్చు, యొరులకొంపలు మూ
పనూహసేయఁగవచ్చు తనయులనైన బోఁదరమవచ్చు
గాని యమలోక బాధయొక్కటియుఁగడువ
కఠినచిత్తులకదిచేత గాదుసుమ్ము భూ.

సీ. వ్రాసినవ్రాఁతఁదా వ్రాయలేదనవచ్చు తప్పుజేసుకులోన
దాచవచ్చు, నీతిఁదెల్పఁగబోతె బూతులాడఁగవచ్చు పెద్ద
లుకాదన్న బెనఁగవచ్చు, యింటికేగినవారి నదిరికొట్టఁగవ
చ్చు కానికూటికి వడిగట్టవచ్చు, పలుగుకొయ్యలమాట
పాటిసేయఁగవచ్చు బుధులవాక్యము త్రోసిపుచ్చవచ్చు

గానికూర్మిరులు యమభటు ఘనగదాభి
హతుల బాల్గాకయుండ శక్యంబె తనకు భూ.

సీ. తల్లిబందెలమారి తండ్రియవ్వలముచ్చు జ్ఞాతిబహుద్వేషి
భ్రాతకోపి, మరదలుబహుచండి మామగారవివేకి యత్త
దుర్గుణగణాయుత్తభావ, మరిదితంత్రగొట్టామనసి కోడలు
మంకు భార్యగయ్యాళి నిర్భాగ్యురాలు, చెల్లెలుగడుదొం
గయల్లుఁడు కూళపుత్రుఁడు దుష్టయుండు
కూతురుపిసాళి.అందరికి పెద్దకార్మొర్గుడరయుతాను
యిట్టిపురుషాధముని జన్మమేఁదుకొఱకు భూ.

సీ. కన్నగానికి జూదగాఁడుమిత్రుఁడు మద్యపానవృత్తికి కుల
భ్రష్టుగురువు, పరమలోభికి మలభక్షకుండనిపతి గుణహీను
నకుపల్లెకొయ్యతంత్రి. ధర్మశూన్యునకు కృతఘ్నుండుచు
ట్టాలు మొండివానికిదుష్టయుండె కొడుకు, కర్మబాహ్యున
కు సంకరకులుండాప్తుండు దొంగవాండకు లంజకొడుకునీడ
యగుమనస్త్రీస్య సంబంధమామఁయున్న
యిట్టివారలెసిరి గాంచికీర్తిరి భూ.

సీ. తండ్రిదూషించి పెద్దలనుతింపఁగ నేల తిమ్మఁలఁజెరిపిసద్ధర్మ
మేల, తల్లినిదన్ని బాంధవపూజనంబేల మిత్రునిబిడిచి పై
మేల్మేల, గురునినిందించి భూసురులవేడఁగ నేల బిడ్డనమ్మి
యొకఁద్రబెంచ నేల, యాశ్రితునటువోలి యర్థరక్షణమేల
నినిమిటదిట్టు దైవనుతియేల
మెఱుఁగనేరని మూఢుల కేమిచెప్ప
తెలియబడవచ్చు యమసభాస్థలమునందు భూ.
ఊళ్లుదోచుకు రాతిగుళ్లుగట్టఁగనేల యిల్లుబుచ్చుకు తోటలే

యనేల, పరిజనంబీషించి ధర్మము సేయఁగా నేల దాస్యగోత్రి
సువర్ణదానమేల, మాన్యముల్ కబళించి మఖము సేయఁగ
నేల సాధులఁజెరిపి పైశాంతులేల, బంధులసొమ్మునపహరించి
భూరియివ్వఁగ నేల పరములుగూల్చి గోపురములేల
యిందుకుఫలంబు దేహాంతమందెతవకు
నెఱుకబడుగాక కూళలకేల చెప్ప భూ.

సీ. బురదగోతులలోన బొరలాడు పందికి సారచందనగంధచ
ర్చయేల, పరగళ్ల వెంబడి దిరుగుగాడిదికి విశాలమందిర ని
వాసంబులేల, బయలుపుల్లెలునాకి బ్రతికెడుకుక్కకు స
రసాన్నభక్ష్య భక్షణములేల, యడవుల చెట్టెక్కి యాడుకో
తికిరత్న సౌధాగ్రసీమ సంచారమేల
మూర్ఖజనునకు సతతప్రమోదకరణ
సాధుసజ్జనగోష్ఠి ప్రసంగమేల భూ.

సీ. పదుగురుమెచ్చి శాబాసునన్నదిమాట నడిమార్గంబుల జి
క్కువడినమాట, వ్యాఘ్రసింహముల నుక్కణగించునదివో
ట యసంఖ్యఫలోత్కృష్టమైనతోట, నిండుగాబహుజనులుం
డునదేపేట యిల్లాలుగల్గుట యింటిశేట, పరులచే సాధింప
బడకయున్నదెకోట పదినిండినడచుచున్నదియబాట
విన్నవారికి హృద్యమైయున్నపాట
కన్నవారికిఁ జిత్రమైయున్ననాట భూ.

సీ. కలిమెంతగలిగిన దొలఁగవాపత్తులు తమకెన్నివిధముల దఁ
న్నుకొన్న, తపమెంతగలిగిన తప్పదుకర్మంబు తోచకతమ
కెంత దుఃఖపడిన, చదువెంతగలిగిన వదలదుదారిద్ర్యము
రకె తమకెన్ని యూళ్లుజనిన, బలమెంతగలిగిన బాయదువ్యా

ధులు తమయమెన్నో యుపాయములున్న
యనుభవంబులు దప్పించుకొనఁగ శక్తి
గల్గునే స్వామి నీయనుగ్రహముదక్క భూ.

సీ. కలిమెంతయున్న బీదకుఁ దెప్పగావద్దు విద్యయెంతున్న గర్వింపవలదు, ధనమెంతయున్న మత్తతవహింపగవద్దు దొరతనంబెంతున్న త్రుళ్లవద్దు, వీర్యంబదెంతున్న విఱ్ఱవీఁగగవద్దు తపమెంతయున్న క్రోధంబువలదు, బలమెంతయున్న దుర్బలున దెంతనవద్దు ప్రజ్ఞలెన్నున్నఁ జెప్పంగవలదు
సాటిఁజెప్పినయీ మాటపాటిజేసి
యున్నమనుజులుబహు కీర్తినొందఁగలరు భూ.

సీ. పరవంచనాబుద్ధి పాటిసేయగవద్దు విబుధులతోఁ గోష్ఠివిడువవద్దు, యుపకారికపకార మూహసేయఁగవద్దు అన్యులనింపోక్కు లాడఁవద్దు పెద్దలుతగవుజెప్పిన ద్రోయుగావద్దు పరుల బాగును చింతపడఁగవద్దు, పలుగుకొయ్యలను చేపట్టియుండగవద్దు శివవిష్ణు దూషణల్ చేయవద్దు
యిదియెఱుంగని కూళల కేలచెప్ప
తెలియఁబడవచ్చు యనుసభాస్థలమునందు భూ.

సీ. ఆత్మకన్యావిక్రయాసక్తునకు మాదూషకుండగు కూతు రుండుదలఁప, పరయువతీలోలునా భావభోజికి దురాచారుఁడైదగు శిరస్స్నానరతుఁడు, విప్రవర్గక్షేత్రవిత్తహారికి యపరాధియానగ్రహారప్రదాత, సతతసంధ్యాకర్మ సంత్యక్తునకు మహాశఠుఁడునో యజ్ఞదీక్షాపరుండు
యహహ యీకలికాల మాహాత్మ్యమరయ
వింతయైదో చెఁగద ధరాభ్యంతరమున భూ.

సీ. రణభీరువునకు దారుణభయంకరుఁడైతోఁచు ప్రబలసంగ్రామప్ర
వర్తకుండు, ననృతభాషికి నసహ్యాలాపుఁడై యుండు ఘనత
రసత్యవాక్యవ్రతుండు, జడమానసునకు ప్రేలుడిగాయవ
లెనుండు సరసశ్లోకోక్తిప్రసంగశాలి, పాపకారికిదుష్ట భావ
నుఁడైదగు పుణ్యకార్యారంభ బుద్ధిచరితుఁడ
హాహాయీయుగధర్మంబు లరయదరమె
యిట్టిదుర్మతులె సుజనులనెన్నుచుందురు భూ.

సీ. చందనగంధంబు చర్చసేయుటదొడ్డ బురదదాల్పదె దున్న
పోతుమేన, బంగరుతగటిదుప్పటి గప్పఁగోప్పనె గంగిరెద్దు
కు లేదె రంగుబొంత, రమణీయ రత్నహారముఁదాల్పదెయొకసీ
బువేసగానికి లేవె వింతపేర్లు, ఘనతరంబగుసొమ్ము గణియిం
చప్రతిభానె వారకాంతకు లేదె భూరిధనము
వైభవంబునకివిగావు వరుసలరయ
అమితదానయశః ప్రతాపములుగాని భూ.

సీ. కన్నబిడ్డలఁజంపఁగణగఁజూచినయది తల్లిగాదొకవిషవల్లిగా
ని, తలిదండ్రులకుహానిఁ గలుగఁజేసినవాఁడు కొడుకుగాఁడొక
పెద్దపడుగుగాని, తనయులనందందఁ దరమిగొట్టెడువాఁడ
తాతగాఁడొక యమదూతగాని, తమ్ములఁజెరుప యత్నముఁ
జేసెటివాఁడు యన్నగాఁడొక మోటదున్నగాని
తినదుదాయాదులను బ్రోవదలఁపఁజేని
నరుఁడుగాఁడతఁడు వానరుఁడుగాని భూ.

సీ. కాయంబుమృదుగతి కంకటిమెరుగునే పుష్పవాసనచీడ పు
ర్వెఱుగునె, పాయసరుచితెడ్డు బద్గ్రహించునె తేనెతీపినీఁ
గ్గి తెలియఁగలఁదె, సానచేఁదనుగంధ సౌరభ్య మెఱు/

సూత్రింబుమాత్రకె శుద్ధిగనునె, జలముమాహాత్మ్యంబు
దెలియ నేర్చునె కప్ప అడవియోషధి సత్త్వమరయగలదె
తులువమానిసి పెద్దలఁగలిసియున్న
గాని వారిగుణంబులు గాంచఁగలఁడె భూ.

సీ. ఎలుకలఁజంపి పిల్లులఁ బోషించి గువ్వలఁ దునుమాడి సాళ్వ
ములఁ బోసఁగి, కప్పలఁబట్టి నీర్కట్టెలకొప్పించి లేళ్లఖండిం
చి తోఁడేళ్లకిచ్చిఁ, బలుదుప్పులను ద్రుంచి పులులముందటఁ
బెట్టి బక్కల నక్కలపాలుచేసి, ఫలవృక్షవనము కట్టెల
క్రిందఁజూరిచ్చి పొట్టచేలోఁకసి యాఁకోతుమేపి
నట్టితమవంటి ధర్మాత్ము లవనిలోన
గలరెయని మోఁకొయ్యలుఁ బలుకుచుంద్రు భూ.

సీ. గడుపిశాచమురీతి నెడపక భక్షించి గాత్రము సూకరమట్లఁ గ
డుపు పెంచి, గాడిదె చికిలిము గతిఁ వళ్లికించి గొప్పమూఁ
కోతులాగున మదించి, ముదకోఁతిలాగున మొకముబిడా
యించి వరఁడుపోలికె యిక్కువలు గపించి, దున్నచొప్పున
పెద్దపిన్నలఁ దొలగించి తలపుచ్చునుకంబు గలిచరించి
మించితాఁ పెద్దనంచు గర్వించియున్న
హీనునకు గీర్తిగల్గునా యెంచిచూడ భూ.

సీ. కౌటిల్యమెక్కువ కార్పణ్యమధికంబు మాత్సర్యమురవు
దుర్గంధము తఱచు, కోపంబుగాటంబు క్రూరత్వము ఘ
నంబు గర్వంబులావు ముష్కరతదొడ్డ, దారుణత్వము
పెల్లు దౌర్జన్యమతిగొప్ప జారత్వమెచ్చు దౌష్ట్యంబు పెక్కు
చాంచల్యగుణము విస్తారంబు చాపల్యమతిమాత్ర మన్వా
యగతిసమృద్ధి

కలిగివర్తించు పాపచిత్తులుహసించి
యెగ్గులెన్నుదు రార్యుల సిగ్గుమాలి భూ.

సీ. సదమలస్తుత్య వంశమునకు దౌర్జన్యకారి హీనునిబెద్దగాన
మర్చి, సంతతసాధు నిశ్చలపుణ్యాపవర్తికిఁ బలుగుగ సూర్యాలిని
భాగ్యఁగూర్చి, బహుధర్మకీర్తి తత్పరునకు దుర్ణయాకరుమూ
ర్ఖుఁ దనయునిగానొనర్చి, సగససౌందర్య లక్షణకళావతికి
ముష్కరకురూపుని భర్తగాఁగుదిర్చి
అబ్జభవుఁడు తదీయపూజ్యత్వమెల్లఁ
బనికిరానియ్యడచె యేమిపాపమొక్కొ భూ.

సీ. కొండంతవిత్తంబుఁ గూడఁబెట్టిననేమి దానహీనుండైన
మానవుండు, నిఖలవిద్యాభ్యాసనిపుణుఁడైననునేమియమిత
దుర్గర్వాంధుఁడైనమనుజుఁ, డుకుతరసంపత్తుఁగాదవియుండిన
నేమిదీనజనాశ్రయుఁడైనజనుఁడు, బహుకాలమాయుఁవుబ
డసియుండిననేమి యపకీర్తిభాజనుండైననరుఁడు
యిట్టివారల గొప్పలనెన్నుచున్న
పురుషునవివేక మెంతనిఁబొగడవచ్చు భూ.

సీ. చతురంగబల సమృద్ధతినిగ్రాలిననేమి యూనన్నరక్షసేయని
నికృష్టుఁ, డిద్ధరాతలమంత నేలుచుండిననేమిబుధులఁబోషిం
చని మూర్ఖచిత్తుఁ, డన్యదేశంబులు నాక్రమించిననేమి వరి
జనూర్తిపాపిఁ బ్రోవనిఖలుండు, బిరుదుటెక్కెంబులు పె
ట్కొనిననేమి శరణాగతులను బెంచనిదురాత్ముఁ
డిట్టివారల సౌభాగ్యమెందుకొఱకు
వీరిఁగొనియాడఁ బోడపన్నార్తిగాని భూ.

సీ. ప్రభువాజ్ఞకోలఁదియే ప్రజలమర్యాదలు పతిశిక్షకోలఁది

యే సతిగుణమ్ము, భాగ్యంబుకొలఁదియే బంధుసన్మానంబు
తిండికొలందియే దేహపుష్టి, మాతతీర్పుకొలంది కూతుమున
డవళ్లు నేలమంచికొలంది చేలపంట, గురుబోధనాప్రౌఢికొ
లఁది శిష్యుల తెల్వి తండ్రిపెంపికొలంది తనయువృత్తి
గానియెక్కువ తృణమంతగలుఁగఁబోదు
తోచకూరకె చింతించిదుఃఖపడిన భూ.

సీ. తిండిపోతుకుఁగూటి కుండయందునెభ్రాంతి దురితాత్మునకు
గురుద్రోహచింత, కామాతురునకన్య కాంతారతాసక్తి
పలుగుకొయ్యకుఁ గానిపనులతలఁపు, పాపకారికిసజ్జనాపకా
రవిచార మతిహీనగుణికి నీచానురక్తి, కుటిలచిత్తునకు స
ద్గోష్ఠిజనద్వేష మతిధనాకాంక్షి కన్యాయబుద్ధి
బాయవెప్పుఁడు నారటపాలికర్త
మొట్టిదియెకాని తొలఁగరాదెవరికైన భూ.

సీ. దుర్బుద్ధిబలువైనఁ దొలఁగునుసంపత్తి, కృపణత్వమొదవినఁగీ
ర్తి మళ్లు, నన్యాయమెచ్చిన నధికారమూడును మదముదట్టి
నఁజనుమార్దవంబు, జారత్వమెచ్చిన సన్నగిల్లువరిష్ఠకు
టిలత్వమురువైన గొప్పచెడును, గర్వంబుతరుచైన గౌరవం
బుఁదొలంగు దర్విత్యాస పెల్లైన ధర్మముడుగు
యివియెఱుంగక వర్తించుహీనజనులు
పనికిరాకుందురుదు గడ్డిపరకకైన భూ,

సీ. పతిభువుదుర్గయుఁడైన ప్రజలుజేసినకర్మ పతిశిరస్సుండైన
భార్యకర్మ, అజ్ఞానికుఁడు లోభియైన నర్థులకర్మ కరణము
చెడుగైన కాపుకర్మ, తండ్రికుపుత్రుఁడైన తనయుపర్గము

కర్మ తల్లినిర్దయుఁడైన పిల్లకర్మ, క్షితిచిక్కఁజేరినచేని
యాతినికర్మ కుటిలుఁడైననరుండు కులముకర్మ
గానివారలదుష్కర్మ గామతలఁప
మెఱుఁగనేరకవారి నెగ్గెన్నరాదు భూ.

సీ. కవిజనంబుల కుపద్రవముఁ దల్పుటముప్పు బలవంతుతో
వైరపడుటముప్పు, దేశాధిపతిని నిందించఁ బూనుటముప్పు
గ్రామాధికారితోఁ గలఁకముప్పు, చెడి చుట్టమింటికిఁ జేరఁబోవు
టముప్పు కొడుకులతోఁ బొందు చేతముప్పు, భార్యకుఁ జనువి
చ్చి పాటిసేయుటముప్పు పదిమందికాదన్న పనులుముప్పు
కొండికొయ్యలమాట నమ్ముకొనిబుధులు
పాడుతంటాల వనికడ్డపడుటముప్పు భూ.

సీ. పరమమూర్ఖుండైన సరసాగ్రగణ్యుండు శుద్ధజడుండైన
బుద్ధిశాలి, సంకరకులుఁడైన సంపూజనార్హుండు యవివేకి
యైన విజ్ఞాన్వితుండు, గడుపందయైన పరాక్రమశౌర్యధు
ర్యుండు మలభక్షకుండైన మాన్యగుణుఁడు, పరుషభాష
ణుఁడైన బహువాక్యచతురుండు ధర్మశూన్యుండైన తగవు
యనుచుబొగడిక గాంతురీయవనిమెంతి (పెద్ద
హీనులైనను వ్యవహారమూనియున్న భూ.

సీ. సాహసౌదార్య పౌరుషశాలియాతఁడు పావనవంశ సంభవుఁ
డతండు, నిఖిలవిద్యాభ్యాస నిపుణుఁడాతఁడు మహాదానశ
శాధురంధరుఁడతండు, అంచిత చతురుపాయజ్ఞుఁ డాతఁడు
బుద్ధికుశలుఁడాతఁడు పూజ్యగుణుఁడతండు, సదమలకీర్తివి
స్తారుఁడాతఁడు భవ్యసరససౌందర్య లక్షణుఁడతండు
మొ:న్వసిద్ధాశ్రిఁ బదిపల్లెలేలుచుండు

నతఁడుసర్వజనోత్త ముండనఁగఁబరగు భూ.

సీ. కుక్షింభరుని బుధరక్షాపరుఁడంచు నతినికృష్టునిమహాత్యా
గియనుచు, బహుబీజసంభవుఁ బరమపావనుఁడంచుఁ బంచ
గాత్ముని ధైర్యశాలియంచు, రాజ్యకారిని ధార్మికోత్త
ముఁడంచుఁ గఠినచిత్తుని దయాకరుఁడటంచు, జారకర్మునిప
రదారవర్జితుఁడంచు, నుత్తమూర్ఖుని శాస్త్రవేత్తయంచుఁ
గవులుకకూర్తి చేతను గడుపుకొఱకు
సన్నుతింతురుమదిలో విచారపడక భూ.

సీ. పండితశ్రేణికిఁ బ్రబలమాత్సర్యంబు ఘనకవీంద్రులకుయా
చనగుణంబు, భాగ్యవంతులకు వైభవమదోద్రేకంబు స
త్కులోద్భవులకు జారవృత్తి, ధరణీసురులకు సత్కర్మాన
పేక్షిత విద్యార్థులకు దుర్వ్యసనయగరిమ, నరనాథులకు నీచ
పురుషసాంగత్యంబు తాపసోత్తములకు, దామసంబు
నలువగల్పింపడేని తన్మహిమఁబొగడఁ
దరమెయెవ్వారికైన యిద్ధాత్రియందు భూ.

సీ. కలిపురుషప్రీతి కారులైదగుమోట పశులగావరులు భూపా
లురైరి, చెడుగులంటులకెల్ల బొడమినగడుత్రొత్తుకొడుకు
లుదొరలైరి గురుతుదనర, జారచోరులు దురాచారులన్యా
యవర్తులు ప్రబలులైగేరుచుండిరి, మాలలుతమ్మళ్లు
మంగళ్లనంబులు బలువెజ్జులైరి భూతలమునందు
నారయీయుగధర్మంబు లరయమదికి
విస్మయకరంబులై గనుపించుచుండ భూ.

సీ. పంబవురుభీయన్న పనులుపెక్కొనరించి పలుమఱుపరుష
భావలువచించి, పూటపూటకు మాంసపుంజముల్ కబళిం

చిత్రనవైభవమున మాత్రతవహించి, పలుకొంటెలను పెద్దల
జేసిమన్నించి బుధసంగతి కసహ్యబుద్ధిగాంచి, అన్యాయ
మున విశ్వమూర్జనఁగాంక్షించి పెల్లుగాఁదిండిచేయొల్లఁబెంచి
యుంచుకొంటయు సద్వృత్తి యెఱుఁగనట్టి
హీనునకుఁబౌరుషము గద్దియెంచిచూడ భూ.

సీ. అంగడంగడ విచ్చమడిగివేసాల్ వేసి బాబులుదెచ్చి పైజా
ర్లుబట్టి, బాజార్లుదుడిచి సవారీలుమోసి గుర్రాలమేపియు
గుడిరాళ్లుద్రివ్వి, పాగచుట్టంబిల్చి నాగంపుచానలయిళ్ల
కావలియుండి యెఱుకసెప్పి, పశువులగాసి తెప్పలుదీసి ముం
డలదార్చి లంజలకుఁబాదంబులొత్తి
పాట్లఁబడిమీఁద దొరయైన వాఁడుధర్మ
నీతిమార్గంబు నడువగానేరగలఁడె భూ.

సీ. ప్రజలనందఱబాధ పరచుటకై బుట్టి యాచకాళుల దిట్టియ
వలగొట్టి, పరసమహాక వీశ్వరులకెగ్గులుగొట్టి కొంటెల
నలుగురఁగూడగట్టి, పూర్వప్రశస్తలం భూమిలోనికిమెట్టి
పండితోత్తముల రాకుండఁబట్టి, బీదలమనవిదెల్పిన మా
ర్గముపెట్టి ప్రబలసంపత్తి గర్వమునదొట్టి
నట్టికూరిరన్నపాలుఁడు గట్టిదనము
దిట్టముగభవ్యకీర్తిచే పట్టఁగలఁడె భూ.

సీ. పలుగుగయ్యాళి దెబ్బలగండుపంగాడి మాలుగఁబోతు
బల్మాయలాడి, పిశినిగొట్టుపిసాళి పెంకెబొంకులపుట్ట చెడు
గు నిక్కులయిక్క చెనఁటివాంఛ, టకుబాజుకల్లరి టాటో
టుగడుమోట బందెలపుట్టిల్లుయుందగత్తె, రంతులరాట్టంబు
రవ్వలమారి తంటాకోరు రంతులరావుముచ్చు

యిట్టి భ్రష్టంపు పెండ్లాము నేలుచున్న
నరుని దౌర్భాగ్యదశ యెన్న నొరులవశమె భూ.

సీ. దానధర్మవిధానవిహీనమానసురాలు సకలమాయావా
దజన్మురాలు, గుణితరానేక దుర్గుణగణాన్వితురాలు బ
హుజనోపద్రవ సహితురాలు, భూతభేతాళ ప్రభూతభీక
రురాలు సతతాన్యనిందా విహారురాలు, భూరికోపవికార
భావదారుణురాలు పరజనద్రవ్యాపహరణురాలు
యెన్న నిటువంటి పెండ్లాము నేలుచున్న
పురుషుని యభాగ్యమెంతని బొగడవచ్చు భూ.

సీ. తళుకుమిటారి పూవిలుతుచేతికటారి బంగరుబొమ్మ క
ప్రంపుదిమ్మ యన్నులమిన్న చిన్నిసంపెఁగగున్న గో
మునదుదీవి గుజ్జుమావి, వన్నెలదొంతి మవ్వంపుపువ్వుల
బంతి రతనాలతేట నగాలమూట, వందువెన్నెలసోరు బలు
మానికపుతీరు వలపులమొక్క మేల్ తలుపుచుక్క
యనఁగఁ దనరియున్న చెలిగూడి యలరుచున్న
పురుషుని యదృష్ట మెంతని బొగడవచ్చు భూ.

సీ. గమగమవలచు చక్కనిమల్లెపూచెండు తమ్మిపాల్గొమ్మ
చే [illegible]పండు, నిగనిగలాడు బల్సొగసు కల్పసరంబు
రంగారు బంగారు సింగరంబు, చకచకలీను మానికెపుతీ
రు సలాకనీటొప్పు నిప్పువన్నెటివాక, మిలమిలమెఱయు
క్రొమ్మించుమించులతీరు తళతళల్ చూపు ముత్యాలకోవ
యెన్న నిటువంటి లే యన్నుమిన్న దొరకు
మున్ను నిన్నునుతుల్ గొన్న యన్నరునకు భూ.

సీ. చిరతరసౌభాగ్య గరిమపార్వతిపోలి వరభోగములశచీ త

రుణిఁబోలి, బహుతరోత్కృష్ట సంపదనిందిరనుబోలి చతుర
మంజూక్తి భారతినిబోలి, రూపవిభ్రమ కళాగూఢినిరతిబో
లి సంతతక్షమను భూకాంతబోలి, భూరిపాతివ్రత్యమున న
రుంధతిఁబోలి ఖ్యాతిసంతానాప్తి నదితిఁబోలి
చెలఁగుచున్నట్టి యిల్లాలుగలిగెనేని
పురుషమణి పుణ్యమెంతని పొగడవచ్చు భూ.
సీ. సుదతులయురిపెంపు సాలపుపాటలకును ననబోండ్లచిన్నారి
నగవులకును, మగువలగడితంపు సొగసుచెవులకును యు
విదలగడువింత యొప్పులకును, చిలుకలకొలుకుల చిన్నవ
న్నెలకును నతివలదగ్గ యొయ్యారములకు, మొలతలనీటూకు
మేలుకోపులకును చెలియలబలితంపు చెలువములకు
బలునిరాబారి పెద్దలేవలసిత్రాల్లి
జిక్కరనివించు యొరులకుఁజెప్పనేల భూ.
సీ. భామలచెలువంపు మోముఁదమ్ములకును నబలలేజెక్కు
టద్దములకు, కాంతలసొంపుఁగిబ్బిగుబ్బలకును నంగనా
మణుల నూగారులకును, కలకంఠకంఠుల కమ్మవాతెఱలకు
సుందరాంగుల వాలుఁజూపులకును, పల్లవపాణుల మెల్లని
నడలకు మందయానలముద్దు మాటలకును
గాంచిపులకించి ధృతిసంచలించకుండ
నిలువఁగాశక్యమా నె యానలువకైన భూ.
సీ. ఒకమారు వాసంత పికపధూకాకలీధ్వనిఁద్వికృంత నా
దములమించి, యొకమారునిర్మల ప్రకటశరశ్చంద్ర చం
ద్రికా రుచిరహాసములనెరపి, యొకమారునిశితదర్పక ధను
ర్జ్యాముక్త శరజాలనిభకటాక్షములనించి, యొకమారురత్న

కందుకచారు కుచలసత్కాంతు లీక్షించుచుఁ గానుపించి
తరుణులెంతటి ధీరు ధైర్యమెల్లఁ
జూరగొందురు కన్నెత్తి జూచిరేని భూ.

సీ. ఒకమారు కెమ్మోవి యొగపురాణింపంగ సూటిమీటుఁగ
చిన్నిపాటపాడి, యొకమారుఁగుబ్బల యుబ్బునసడలిన ప
యిటమెల్లనె పొందుపడఁగఁదిద్ది, యొకమారుగడితెంబు టొ
య్యారములు దోపఁగిలకిలమనుచు నవ్వులనుఁజొక్క, యొ
కమారుతేనియ లుట్టిపడ్డటువలె జిలిబిలిముద్దు పల్కులవఁ
చెలియ రీతి పురుషుల జిత్తములను (నర్చి
గరుగ జేతురు భృత్యులు గాఁగ తమకు భూ.

సీ. అన్నదమ్ములు కర్మమానిమొత్తుకొందురు అక్కచెల్లెండ్రు
హాయనుచునుందురు, చుట్టాలుపదుగురు చుల్కఁగాఁజూతు
రుతల్లిలోలోపల ద్రుళ్ళునుండు, జ్ఞాతివారలుచాల చప్పట్లు
గొట్టుదురు వదినెగారులు దెప్పిగదుముచుండ్రు, యిరుగుపొ
రుగుల . రు యిండ్లకురానీరు పెండ్లిండ్లకైనను బిలుపరె
శ్రీహరిదొంగ తనమొంత చెడ్డతప్ప (వరు
మెంచఁగా నాఁడుదానికి యేదిలేదు భూ.

సీ. తలక్రిందుగాను వేదముఁజెప్పఁగావచ్చు బహుమంత్రసి
ద్ధులుఁ బడయువచ్చు, సకలశాస్త్రములు ప్రసంగించగావ
చ్చు తీర్థయాత్రసక్తిఁ దిరుఁగవచ్చు, సతతోపవాస నిష్ఠ
లుగాంచగావచ్చు సర్వపురాణముల్ చదువవచ్చు, నృత్యగీ
తాములన్నియు నేరఁగావచ్చు నఖిలగారుడవిద్యలాడవచ్చు
గానిదారిద్ర్యభాధ యొక్కటియుఁగడువ
శక్తిఁగలుఁగదు యేలాటిజనునికైన భూ.

సీ. క్షితినాథుచేత తాజీవ మెందఁగవచ్చు బుధులచే మన్ననఁ బొందవచ్చు, జనులలో బహు యోగ్యుఁడను పించుకొనవచ్చు బుధులలో పలుఁ గొప్పఁబొందవచ్చు, జ్ఞాతులచే మహాస్తవముఁ జెందఁగవచ్చు కులములోఁ బెద్దయై మెలఁగవచ్చుఁ బరులచేఁ బాదముల్ పట్టించుకొనవచ్చు వీరులలో ఖ్యాతి వె
నవనిలో పలమెట్టివాఁడైనగాని (లయవచ్చు
యంచితంబుగ పడికాసుఁ బ్రోయున్న భూ.

సీ. ఉదయాస్తమయముల నొగిసిదప్పిగినువాని బలువరుకొండెముల్ బలుకువాని, సతతంబుపరుషభాషలు వచించెడివాని యన్యాయవర్తనుండైనవాని, బహుగుణాన్వితమైన భార్యఁగూడనివాని మలినదాసీ క్రీడసలుపువాని, కొఱగానిసంకరకులుల గూడెడివాని కానికూళ్లకు వడిగట్టువాని
క్షితినియిటువంటి జనునిలక్ష్మికిటాకు
మానదరయఁగ యించుకంతైనగాని భూ.

సీ. తనుఁదాను నుతిఁజేసుకొనెఁడువాఁడొక మూర్ఖు వలతన్నవనిసేయువాఁడు మూర్ఖు, పలుగు పెద్దామఁ జేపట్టువాఁడొకమూర్ఖు చాడిచెప్పఁగఁ బూనువాఁడు మూర్ఖు, తనకన్నఘనుఁడులేడనెఁడు వాఁడొకమూర్ఖు వనితకుఁజను విచ్చువాఁడు మూర్ఖు, కొఱగానివారల గూఁడువాఁడొకమూర్ఖు పలుగాకివలె పేర్లువాఁడుమూర్ఖు
దనరితనవాండుమిౢ జేసినతప్పువనికె
మోదమలరేఁడు వాఁడొకమూర్ఖు సుమ్ము భూ.

సీ. దుర్గయోద్యోగికిఁ బూర్ణాయువదిసున్న కుటిలచిత్తునకు న ద్గోష్ఠిసున్న, పాపచిత్తునకుఁ బరమార్థమదిసున్న కూర్మితా

తుర్మనకు సాధుగుణముసున్న, సజ్జనద్వేషి కీశ్వరసహాయ
ముసున్న జ్ఞానహీనునకు మోక్షంబుసున్న, ధర్మహీనునకు
నుత్తమలోకగతిసున్న కామాంధునకుఁ బుణ్యకర్మసున్న
బహుకురాచారుఁడై బరఁగుచున్న
జనునకిద్ధరమా కటాక్షంబుసున్న భూ.

సీ. వచ్చినయపకీర్తి చచ్చినపోవదు తీర్చిపుచ్చఁగ నవ్వతీర
దెప్పుఁడు, చేసినకర్మంబు చెల్లదుకుడువక చావుదప్పదు
యొంతజడిసియున్న, దేహాంతమునగాని తెలియవుదనపా
ట్లుజననిందకంటెనుచావుమంచి, దైవంబుతన్నుమాత్రమె
బ్రోచుచుండను పనుగుదుమాట తప్పదూధరిత్రి
యొంతబలువైనదొర నాశ్రయించియున్న
గలుగనేరదు భాగ్యహీనులకు మేలు భూ.

సీ. తనవారలాతివారని భేదమరయఁడు దివిరియాపదల నొం
దించుటయును, శత్రుమిత్రులయందు సమమైనబుద్ధిగాక్షిం
చుచుభంగించిఁజెఱుపుటయును, ఉపకారినపకారి నొకరీతిఁగాఁ
జూచి గావించునెంతటి ఘోరమైన, గురువునుదైవ మేకో
భావమనుకొని దొడరిచేయును యొంతద్రోహమైన
అనుమనీతి జనులుతన్నాడుకొనఁగ
బ్రతుకుమనుజుండు జీవచ్ఛవంబుగాఁడె భూ.

సీ. పెద్దలెవ్వరుపేరఁ బిలిచిమాటాడరు భార్యయెప్పుడు తూల
బలుకుచుండు, బంధువుల్ నలుగురు పాటిసేయఁగఁబోరు త
నవారలంత ఛీకొట్టుచుందురు, పరమార్థసాధనోపాయ
కర్మమడంగు నిల్లునొళ్ళునుఁగూడ గుల్లయగును, అంటిపొం
దినవార లందఱుతేలికబట్టి బల్ గెగ్గిలు గొట్టుచుందు

తవనిలోపల జారత్వమరయహాని
యెంచిచూచిన బుధునికేది లేదు భూ.

సీ. పితృమాతృలకు మనః ప్రీతిగా మెలఁగుచు గురువులపై భ
క్తిఁ గుదురుకొలిపి పెద్దలగనిచాల ప్రేమపూరింపుచు దీను
లఁ బోషించి తెఱవెఱిఁగి, బంధువిధేయుఁడై బహుజనమిత్రు
డై సాధుసజ్జనగోష్ఠి సలుపుచుండి, పరకాంతలను మాతృ
భావంబుఁ గాఁజూచి సంతతధర్మప్రవర్తుఁడగుచు
మెలఁగుచున్నట్టి వాఁడె పోదలప భవద
ఖండ కారుణ్యమునకుఁ బాత్రుండు సుమ్ము
భూరిమహిమాస కోలంకపురనివాస
మదనగోపాల రాధికా హృదయలోల.



శ్రీ

# —ఆంధ్రభాషావిలాసిని—

——:o:——

ఇదియొక తెలుఁగు మాసపత్రిక,

పత్రికాధిపతి, కావ్యనిధి,

శ్రీ చలికాని లచ్చారావుగారు

ఇందు సుప్రసిద్ధకవులు రచించిన పద్యకావ్యములు, గద్యకావ్యములు, నాటకములు, శతకములు, పూర్వకవుల యముద్రితగ్రంథములగు పురాణప్రభృతులు ప్రకటింపఁబడు చుండును.

సంవత్సరమునకు చందా 2—0—0 లు మాత్రమే.

——

వలయువారు, కార్యదర్శి,

ఆంధ్రభాషావిలాసినీ కార్యస్థానము,

చిత్రాడ,

పిఠాపురంపోస్టు, గోదావరిజిల్లా.



శుభమస్తు.

# శ్రీ వేంకటాచలనిలయశతకము.





శ్రీ రమణీ హృదయాబ్జ వి
హారా పరమేష్ఠి శంకరాఖండల బృం
దారక వినుతాచారా
హార యశస్సార వేంకటాచల నిలయా.

శారద బుద్ధివిశారద
పారద పరిశుభ్రవర్ణ బలపిమదీయా
దార వచనరచనా సువి
హారిణియాంగాత్ర వేంకటాచల నిలయా. 2

మృత్యుంజయు ప్రియతనయుఁడు
ప్రత్యూహము విఘ్నరాజి బలముడిపి సదా
కృత్యాద్యంతము లరయుత
మత్యుత్తమ లీల వేంకటాచల నిలయా. 3

ఈశుఁడు సంతతవినత ది
గీశుఁడు వరసిద్ధసాధ్యగీర్వాణ కృపా
వేశుఁడు పరమేశుఁడు న
న్నాశుగతిం బ్రోచు వేం. 4

పరమేష్ఠి పరమదయతో
　　చిరజీవమొసంగి రక్షసేయుతమని యా
　　దరమున వినుతించెదఁ గర
　　మరుదా వాఙ్నియతి వేం. 5

నిను నమ్మి కొలుచు జనముల
　　కనుపమ చిరసౌఖ్యదాయి యౌ సత్పదవిన్
　　గొనకొని దయచేసెదవని
　　యనుగదనిగమములు వేం. 6

అనుదినము వేడుచుంటిని
　　వినుమొండొకదైవ మెందు వెదకిన లేదం
　　టిని వింటిని వినలేదని
　　యనుమంటిని బలుకు వేం. 7

రారాదా మమ్ముఁగనుగొని
　　పోరాదా భక్తనమితిఁ బ్రోచుటకభయం
　　బీరాదా కృప లేదా
　　యారా కానిమ్ము వేం. 8

కరినరసి బ్రోచితనియెడి
　　గురుతరమగు నీదుకీర్తి కో యని పొగడన్
　　దురితముల నడఁచి కృప న
　　న్నరయఁగ రక్షింపు వేం. 9

ఘనుఁడవనుచు నిను వేఁడిన
　　వినుచు దయామృతసువృష్టి వెల్లివిరియఁ జే
　　సినగాక ఘనత గలదా
　　యనుపమగుణజాల వేం. 10

సిరిగలిగిన దనవారలఁ
గరమురసి యనుగ్రహింపఁగావలె గాకీ
తెరగున నుపేక్ష తగునా
యరుదాయె నిదేమి వేం.                    11

కుధరం బెత్తుటకంటెను
బృథుగతి శిలదన్నుకంటె పృథ్విన్ గిటిలీ
లధరించుటకంటెను భర
మధికమె కృపఁగనుట వేం.                    12

వెన్నుఁడవు నీవు నిజమని
యన్నానేకాని గొల్లయతివల నిండ్ల
న్వెన్నలు మ్రుచ్చిలితని ని
న్ననన్నానా నేను వేం.                    13

వాదించెదఁ గృపగనుమని
మోదించెద నీచరిత్రములువిన దయసం
పాదించెద నుతుల సదా
హ్లాదాహతఖేద వేం.                    15

పరిభవమున ద్రౌపది ని
న్నరుదుగ నెదఁదలఁప నక్షయాంబరములు చే
కురె గురువరుసభగల తన
యరులాశ్చర్యపడ వేం.                    16

భరపడియెడి దానసము
ద్ధరణము నీబిరుదెయౌను దారాక్షణం బా
కరిబ్రోచుటె నిర్దయ నీ
కరయఁగ మునులేదు వేం.                    1

వినుతచరిత్రుఁడవే యని
యనుదినము నుతింతుగాని యాభీరవధూ
జనవసనహారివని ని
న్ననఁగలనా నేను వేం. 17

నీకై వ్రతోపవాసము
లేకాంతఃకరణవృత్తి నేఁజేసితి నీ
రాక వడిఁగోరుచును సుగు
ణాకర కరుణింపు వేం. 18

పాకరిపువినుత శ్రితజన
లోకాంచిత పారిజాత లోకేశ దయా
లోక వినుతింతు నిను సుగు
ణాకర దయఁజూడు వేం. 19

ధరణీపులవేడ నత్యా
దరమున బెరడైనవతములఁ దలఁచి నుతింప
స్గరుణాదలిర్పఁగఁ ద్వరలో
నరయుము నీవాఁడ వేం. 29

పరమోపకారివని నీ
చరితలు ప్రకటించుగాని చయ్యన వినుమా
గురుతునను దయను బ్రోచుట
హరిహయనుతచరణ వేం. 21

ఏతన్మాత్రుఁడవా ప్రి
ఖ్యాతిం జగములను గావఁగా వెలసితివో
శీతోష్ణకరవిలోచన
భూతురత యిఁకేల వేం. 22

పలుదెఱఁగులనిను బిలిచితి
దలఁచితి నెమ్మదిని హృదయతామరసమునన్
నిలిపితిని కేమిఁజేసెద
నలఘుగుణాభరణ వేం. 23

భారము నీయదియని నే
సారమతి న్నుతులొనర్తుఁ జయ్యనదయతో
క్షీరముననో నీరముననో
యారసినను ముంపు వేం. 24

భారమనక క్రోధారుణ
ధారాదృక్సమితి వెలయఁ దతమదిరిపు సం
హారావిచార నూనవి
హారివి గావయ్య వేం. 25

భండనమున దర్వీకర
కాండము రవిసుతుఁడు వేయఁగాఁ దచ్ఛరమా
ఖండలసుతు దునుమవమి నీ
యండయె కాదయ్య వేం. 26

పాండురవర్ణుఁడు సుమకో
దండవిపక్షుఁడు దిశావితతివసనుఁడు బ్ర
హ్మండోదరుఁ డీశుఁడు నీ
యండనె మదిఁగోరు వేం. 27

సకలాశాధిప విలస
న్మకుటాంచత్పద్మరాగ మాణిక్యవిభా
ప్రకటీకృత పదయుగళా
అకలంకా వరద వేం. 28

నీకళ్యాణ గుణంబు ల
నేకంబులు నేనుతింప నేర్తునె త్రిదశా
నీకంబు జాలదనఁగ వి
భాకర శశినేత్ర వేం. 29

పూతన విషవక్షోజము
పోతమవని నినుఁ గుడుపఁబూనిన నసువు
ల్వాతెఁగొని యీవె యెగ్గస
కాతత మోక్షంబు వేం. 30

గొల్లఁడనఁగ నెగడినసడి
తల్లినిగనుగప్పి పరుల దధినవనీతం
బెల్లెడలఁ గొంటివనియెడి
యల్లరి పోదయ్య వేం. 31

మృదువచనంబులఁ గర్కశ
హృదయముపేశలత నొందునేయాదిధుతీ
పదమెఱిఁగి నీవెదయఁగను
మదయుత వే విడువు వేం. 32

ఒప్పరయఁగ నాదిని నీ
వప్పులఁ బడియుంటఁ దెలిపె నాశ్రితులిఁక ని
న్నప్పుకొన నేమియనఁగద
వప్పా కరుణించి వేం. 33

వరగోవర్ధన మెత్తుట
నెరుఁగమె పాలకునుబాల నెత్తుటయె పురం
దరుఁ గెల్చి యాదవుల మే
లరయుటకై కాదు వేం. 34

గురినిలిపి నీపదాబ్జము
లిరవుగఁ బూజించువారి కిహమున ధనగో
తురగేభ దానదాసిక
లరుదా పరమొదవు వేం. 35

కరుణారసధారను నా
దురితాగ్నులనడఁచి ప్రేమతోఁ బ్రోవు సు
స్థిరముగ నీవాఁడను సు
మ్మరికాననదహన వేం. 36

ఆరయ గామోర్వర నీ
కారుణ్యకటాక్షదృష్టి గలిగినయెడ ము
క్త్యాఖ్యఫలించుట యరుదా
యారసి దయఁజూడు వేం. 37

దినకరునిచేత దుహినము
ధనమున దారిద్ర్యవితతి తరలినయటు నీ
వినుతకథాశ్రవణముచే
ననయం బఘమడఁగు వేం. 38

దయగల దేవుఁడవని నే
భయభక్తులఁ బిలుతు చక్రపాణీ యనుచు
న్నయమార్గమహానె పలుకమి
యయయో వింతాయె వేం 39

పలుగాకిని కఠినుఁడ ని
శ్చలచిత్తుఁడగాను భక్తిజాడ లెఱుఁగ ద
ప్పులువట్టక దయతోఁగను
మలఘుగుణాభరణ వేం. 40

నీకళ్యాణ గుణంబుల
నేకంబులు నేనుతింప నేర్తునె త్రిదశా
నీకంబు జాలదనఁగ వి
భాకర శశినేత్ర వేం. 29

పూతన విషవక్షోజము
పోతమవని నీకుఁ గుడుపఁబూనిన నసువు
ల్వాతిఁగొని యీవె యెగ్గస
కాతత మోక్షంబు వేం. 30

గొల్లఁడనఁగ నెగడినడి
తల్లినిగనుగప్పి పరుల దధినవనీతం
బెల్లెడలఁ గొంటివనియెడి
యల్లరి పోదయ్య వేం. 31

మృదువచనంబులఁ గర్కశు
హృదయముపేశలత నొందునేయాదిథునీ
పదమెఱిఁగి నీవెదయఁగను
మదయత వే విడువు వేం. 32

ఒప్పరయఁగ నాదిని నీ
వప్పులఁ బడియుంట దెలిసె నాశ్రితులిక ని
న్గప్పకొన నేమియనఁగద
వప్పా కరుణించి వేం. 33

వరగోవర్ధన మెత్తుట
నెరుఁగమె పాలకునుతాలనెత్తుటయె పురం
దరుఁగెల్చి యాదవుల మే
లరయుటకై కాదు వేం. 34

గురినిలిపి నీపదాబ్జము
లిరవుగఁ బూజించువారి కిహమున ధనగో
తురగేభ దానదాసిక
లరుదా పరమొదవు వేం. 35

కరుణారసధారను నా
దురితాగ్నులనడఁచి ప్రేమతోఁ బ్రోవు సు
స్థిరముగ నీవాఁడను సు
మ్మరికాననదహన వేం. 36

ఆరయ గామోర్వర నీ
కారుణ్యకటాక్షవృష్టి గలిగినయెడ ము
క్త్యాఖ్యఫలించుట యరుదా
యారసి దయఁజూడు వేం. 37

దినకరునిచేత దుహినము
ధనమున దారిద్ర్యవితతి తరలినయటు నీ
వినుతకథాశ్రవణముచే
ననయం బఘమడఁగు వేం. 38

దయగల దేవుఁడవని నే
భయభక్తులఁ బిలుతు చక్రపాణీ యనుచు
న్నయమార్గమాన పలుకమి
యయయో వింతాయె వేం 39

పలుగాకిని కఠినుఁడ ని
శ్చలచిత్తుఁడగాను భక్తిజాడలెఱుఁగ ద
ప్పులువట్టక దయతోఁగను
మలఘుగుణాభరణ వేం. 40

భయమైనను నీపాద
ద్వయ మెదఁ గీలించి కేశవా యని నుడువన్
జయమగు నెల్లరకును హరి
హయ వినుతచరిత్ర వేం. 14

చందనముల దిన కుబ్జకు
సుందరతర రూపమొసఁగి సూనాస్త్రక్రియన్
బొందుగఁ దేల్చితివని ని
న్నందురు బుధజనులు వేం. 42

ముదముగఁ గాలయవను ముచి
కుందునిచే బొలియఁజేసి కోరినపదవిన్
బొందించి మించితని ని
న్నందురు కోవిదులు వేం. 43

అంబుజములు రవిహిమకర
బింబము నుత్పలచయంబు బీదజనము వి
త్తంబుం బలె నినునేని
త్యంబును గోరెదను వేం. 44

భవ్యుఁడవు యోగిజనతా
సేవ్యుఁడవు విరించి చంద్రశేఖర ముఖసం
భావ్యుఁడవు దివ్యుఁడవు నిజ
మవ్యయుఁడవు నీవు వేం. 45

కలలోన నిన్ను నెఱుఁగని
మలినాత్ముఁడా పదనురమాధవ యనుచున్
దలఁచిన గుణమెన్నక నీ
పలరుచి రక్షింతు వేం. 46

పలికించు వాఁడవీవే
పలికెడు వాఁడవునునీవె పరమాత్మభవ
ద్విలసన గుణములు నుడివెద
నలరుచు దయఁజూడు వేం. 47

సులభుఁడవును దుర్లభుఁడవు
తెలిసినయెడఁ దెలియకున్నది నిజులకై నం
బలిభంజన కరిరంజన
యలఘు గుణాభరణ వేం. 48

రమ్మంటినో తెమ్మంటినో
సమ్మతిభవరోగ ముడుపఁజాలెద వభయం
బిమ్మంటి నీకిదియసా
ధ్యమ్మా కాదంటి వేం. 49

ఘనపాంచజన్యమును నీ
వనువుగ ధరియించి వైరియడరులడఁగఁగా
మునుకొని మొరయింపుముని
న్ననుదినము నుతింతు వేం. 50

బంధురకోపాన్వితరిపు
బృందభూభ్రమణ వల్లకిగిప్పమ్రంబా
నందకము నందిమదిప్రు
లందఱు మఱందింపు వేం. 51

త్వరను సుదర్శననామక
పరిపంథికూర దానవప్రాణసదా
చరఫణిచక్రముగొని రిపు
హరణము గావింపు వేం. 52

కామాదిషైరి షట్కము
పైమించుచు నున్నదిపుడు పడనదుపుమునీ
శామోదకీ గదాహతి
నామోదముతోడ వేం. 53

సీకాస్తంభ రత్నంబును
వైకుంఠుని హృదయనాసి వైయనురాగ
శ్రీకిఁగుదురైతివని సుగు
ణాకర వినుతింతు వేం. 54

కరిరాజ వరదవిష్ణూ
గరుడధ్వజచక్రపాణికంసవిరోధీ
మురహార కేశవ మాధవ
హరికృష్ణ ముకుంద వేం. 55

అజగరదానవ వధనగు
నిజతేజోమహిమ జూచినిను నరుఁడనఁగా
వ్రిజజనములో లిఁదలఁచిరి
యజుఁడవనుచుఁ గృష్ణ వేం. 56

స్ఫురదురు తావకపాదాం
బురుహద్వయ మెదనునిలిపి పూజించితివే
మరుమానసి కముగాఁబుర
హారవినుత చరిత్ర వేం. 57

వరదుఁడవని నద్భక్తిని
గరిమొరలిడ మకరిశిరము ఖండించిభవ
త్కరుణను నిరుపుర మనుచుట
యరుదామోఁ గదయ్య వేం. 61

సోమకుఁడు సకలవేద
స్తోమముహరియించి జలధిఁజొచ్చినవానిన్
వే మడియించితి మీనను
వై మహిమ నెలంగ వేం. 59

సురలును దనుజులుజలనిధి
దరువఁగ మందరముగుంగు తఱికూర్మమవై
భర మూనిసురలఁ బ్రోచితి
వరి దానవులడఁగ వేం. 60

కనకాక్షుఁడు నినువెదకెద
ననుకొని వసుమతినిజుట్ట నాతనిగిటివై
కినుక నడఁచితాల్చితివే
మనఁగల కుతలంబు వేం. 61

డింభకుఁ బ్రహ్లాదుని శ్రమ
దంభి హిరణ్యకశిపుఁడను దైత్యునడఁపఁగా
స్తంభమున దోఁచునరహరి
యంభోజదళాక్ష వేం. 62

కురుచవగుచు బలినిద్రిపద
ధరణీదానంబుగోరి దానవ సంప
ద్ధరణము జేయుచు మించితి
వరయఁద్రివిక్రమత వేం. 63

ఇరువదియొక పరి భూపుల
నరుకుచు శ్రీపరశురామ నామమున ధరా
మరులకి వసి యొసఁగతివో
హరిపద్మదళాక్ష వేం. 64

హరువిల్లువిరచి భూమిజ
పరిణయమై పంక్తిగళుని బరిమార్చిన పాం
డుర కీర్తివి శ్రీరామా
హరవర్ణితనామ వేం. 65.

బలియుఁడు బలరాముఁడు నా
వెలసిసుధాశన విరోధివిదళనమున భా
సిలి రేవతివరియించిన
హలధర గోత్రధర వేం. 66.

పురదానవ హరణార్థము
గిరిశునకు న్దోడుపడుట కీర్తిదమని ఖే
చరులు మొరవెట్టబౌద్ధత
నరయ వహించితివి వేం. 67.

ఖలులధికుల గుచునచలా
వలయము వెస నాక్రమింప వారినడఁపఁగా
నిలకల్కివికాఁబోయెద
వలఘుమతినవ్వరద వేం. 68.

ధరణిజనియించి కంసా
ద్యరులనుహరియించి మించియాభీర స్త్రీ
ల రతులఁ దేల్చినకృష్ణా
హరపంకజనాభ వేం. 69.

దక్షావిల సత్కౌస్తుభ
వక్షా శకటాఖ్య దైత్యవారణ నవహ
ర్యక్షాత్రిదశ ప్రముఖా
ధ్యక్షా రిపుశిక్ష వేం. 70.

ధీరాముని జనహృదయ వి
హారావిధి రుద్రవందితాఖిల సుగుణో
దారా రాత్రించర సం
హారా సువిచార వేం. 71

శ్రీదాపురు హూతార్చిత
పాదానతభక్తలోక బంధుర కలుష
చ్ఛేదానిఖిల త్రిదశా
హ్లాదాహతభేద వేం. 72

ఈశారాతిశ్రించరగళ
నాశాపోషిత గజేంద్ర నవ్యాంబుదసం
కాశాగుణపూరిత సక
లాశాలక్ష్మీశ వేం. 73

సీతాతరుణీ నేతా
వాతాశనవిధి శివాభివందితగుణ సం
ఘాతా శుచికీర్తి ప్ర
ఖ్యాతానిర్ణేత వేం. 74

రంగాకల్పిత తార్క్ష్యతు
రంగానత్యాం తరంగరాజత్కరుణా
పాంగా నత సురపతి స
త్వాంగా రిపుభంగ వేం. 75

మాయలను మానిదయతోఁ
జేయంగల పనులనెల్లఁ జేయుము నేమం
గాయికిఁ దెల్పిననీపై
న్యాయమనోపించు వేం. 76

పెద్దవని వేడఁగను నా
వద్దకురావైతి రోటనినువడఁగట్ట
న్పెద్దలను జేరి గొల్చితి
పెద్దర నీగుణము వేం. 77

నీవే దేవుఁడ వనుచును
నీవేరక్షకుఁడవనుచు నిక్కంబనుచు
న్నేవింటినిన్ను వినుతుని
యావల మరిగలరె వేం. 78

అమలిన పదపంకేజ
భ్రమరీకృతయోగి వరవిరాజిత చిత్తా
సముచిత కరుణోదాత్తా
యమితగుణాయత్త వేం. 79

దశదిగ్విలాసినీశ్రుతి
విశదీకృత నైజ కీర్తివిస్ఫురిత వల్లీ
కిసలామూంబుజ భసలా
యసదృశ ధృత్యచల వేం. 80

నేనునిను నమ్మి భక్తిని
దైనందినపూజ సలిపితఁడబడిక ఁయని
త్యానిశరీరాణి' యనుచు
ధ్యానింతును గావు వేం. 81

తినలేదా బలుసాకని
నినునేనన నిజముబల్క నిష్ఠురమనుచున్
వినినామెద దోసము లే
దని కనికరముంచు వేం. 82

వలపున గోపాంగనలను
  బలుమరు మరుకేళిదేల్చి వలసిననాతిన్
జలమూనిముసిగ్గుఁ గోయుట
  యలవాటా! నీకు వేం. 83

కలవనిసకలాగమములు
  తెలుపునుఘోషించి నిజముతేటపడఁగ నీ
యదుగైనఁ గనులఁజూడక
  యలవగు నానమ్మ వేం. 84

పగవాని సోదరునకీ
  వగణితసామ్రాజ్య మిచ్చితనుచును నినునే
మొగమోటము పెట్టెదనని
  యగపడ వెటుగోదు వేం. 85

దీనార్థి కల్పభూజా
  భానుసహస్రైకతేజ భవవినిముఖ స
మానితసుగుణ సమాజా
  యానత సురరాజ వేం. 86

కారుణ్యమూని వాంఛిత
  మే తీరిసొసంగినతము నేలెదవో సదా
చారా కౌస్తుభవిలస
  ద్ధారా నగధీర వేం. 87

కరుణానముద్రిడ నీ
  చరణములను గొలుచు భక్తజనముల కోర్కుల్
త్వరలో దీర్చుటకుదా
  యరుదా నానుడువు వేం. 88

నిర్మల చిత్తుండై యే
కర్మంబులనేని నరుఁడుకంజాక్ష నిను
న్మర్మంబు లేకతలఁచిన
నర్మిలి రక్షింతు వేం. 89

పక్షిస్థసకల భువనా
పక్షిప్రభుగమన దనుజవన్యవిదహనా
చక్షుఃశ్రుతీశ శయనా
అక్షివిజిత నలిన వేం. 90

భరమేమి గరుఁడొకరుఁడు
కరువలిసుతుఁడొకఁడు గలుగఁగావిచ్చేయన్
సరిరమ్ము తెలిసెనంగతి
యరమర లేకమాను వేం. 91

మటుమాయ సేయునీపద
తటినీజీవనము నిఖిలదాసాఘములన్
యెటుసేయ లేవునీవిఁక
నటమటఁ బెట్టకుము వేం. 92

దుష్టుల శిక్షించెదవని
శిష్టుల రక్షింతువనుచుఁ జెప్పగనేలా
స్పష్టముగ మోహిసెనిగమము
లష్టదిశాంతముల వేం. 93

రావాయీనా భక్తుల
సేవలుగొనిమేము మున్నుఁజేసిన సుకృతి
న్దేవరకు బుద్ధరూపమ
హావెలసెను గాక వేం. 94

దురితతమో భాస్కరుఁడవు
శరణాగత వత్సలుఁడవు శాశ్వతుఁడవు నీ
కొఱకు వినుతింపవలదా
వారికరుణాల వారి వేం. 95

వగ లేదు నీకునాయెడ
తగవునుదప్పవు సభక్తి తాత్పర్యముతో
మిగులనినుఁ జూడవేడిన
నగపడ వేమయ్య వేం. 96

సంకల్ప మాత్రమున నీ
పంకజ గర్భాండవితతి ప్రభవించుఁగదా
కింకరుని బ్రోచుచో నీ
కంకిలి యేమయ్య వేం. 97

దుగ్ధాబ్ధి శయన వనద
స్నిగ్ధమహాత్తర శక్రరసిత నలినాక్షా
దగ్ధాఖిల కిల్బిష స
మ్యగ్ధైర్య హిమాద్రి వేం. 98

గర్భస్థాబ్జ భవాండా
నిర్భాగ్యా సురనిశీథి నీమార్తాండా
నిర్భిన్నకలుష ప్రహ్లా
దార్భక పరితోష వేం. 99

పెద్దనిను నమ్మువారి వి
పద్దశ యెప్పుడును జేరఁ బాల్పడమినిదా
సద్దణఁగి పోవుచటగద
యద్దిర నీమహిమ వేం. 100